# ఆంధ్రపత్రిక

317601



The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 36 No 242 MONDAY 5th DECEMBER 1949 వెల ఒకఅణా } Founder: K. NageswaraRao

# "క్షుద్రకలహాలతో కాలయాపన చేయక మన కొత్త హోదాకు తగ్గట్టుగా ప్రవర్తించడం నేర్చుకోవాలి"

## భారత ప్రజానీకానికి ప్రధాన మంత్రి ఉద్బోధ

## "ప్రజలూ, ప్రభుత్వమూ సహకరించి పనిచేస్తే దేశాన్ని ఐశ్వర్య సౌభాగ్యాలతో విలసిల్లేటట్టు చేయగలం"

న్యూఢిల్లీ, డిసెంబరు 3: భారత ప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ నేటిరాత్రి ఢిల్లీ రేడియోలో ప్రసంగిస్తూ, ప్రజలు క్షుద్రకలహాలతో కాలయాపన చేయక భారత దేశానికి అనతి కాలంలో ప్రాప్తించనున్న రిపబ్లిక్ హోదాకు తగ్గట్టుగా ప్రవర్తించడం నేర్చుకోవాలనీ, ప్రజలు కష్టించి పనిచేసి ఉత్పత్తినీ తద్వారా దేశసౌభాగ్యాన్ని వృద్ధిచేయవలెననీ ఉద్బోధించెను. "భారతదేశ ఆర్థికవ్యవస్థలో స్వతస్సిద్ధంగా దౌర్బల్యమేమీ లేదు. ఇప్పుడు మనకు కావలసినదల్లా ఒక్కటే - నిరంతరమైన పరిశ్రమ. కష్టించి పనిచేసినట్లయితే దేశాన్ని ఎదుర్కొంటున్న ఆర్థికసమస్యలను అధిగమించి త్వరలోనే అభివృద్ధి సాధించగల మనడంలో సంశయం లేదు." అని ప్రధానమంత్రి ఉద్ఘాటించెను. "మునుపు మన ప్రదర్శించిన దేశసేవా పరతంత్రత అంతా ఈనాడు సంకుచితమైన స్వలాభాపేక్షగా మారిపోయింది. ప్రజలూ ప్రభుత్వము సహకరించి పనిచేసినట్లయితే, దేశాన్ని దారిద్ర్యపీడనుండి విమోచించి, ఐశ్వర్య సౌభాగ్యాలతో విలసిల్లేట్లు చేయగలం." అని పండిట్ నెహ్రూ అన్నారు.

ప్రధానమంత్రి ఈ విధంగా ప్రసంగించారు: ఇంకో 7 వారాలలో భారతదేశం రిపబ్లిక్‌గా ప్రకటింప బడుతుంది. భారతజాతి ఇతిహాసంలో ప్రారంభం కానున్న ఈ నూతనాధ్యాయ రచనను ప్రజలు ఈ నడిమికాలంలో ...

# 15 ఏళ్ల వరకు భారత పరిశ్రమలు జాతీయం కావు

## అమెరికాలోని భారత రాయబారి విజయలక్ష్మి పండిట్ వివరణ

క్లీవ్‌లాండు (ఓహియో), డిసెంబరు 3: "ఇండియాలో కాంగ్రెసుపార్టీ పరిశ్రమలు జాతీయం చెయ్యాలని సిద్ధాంతరీత్యా అంగీకరించింది. అయినా పరిశ్రమలు జాతీయం చెయ్యడానికి ఇంకా 15 ఏళ్లు పట్టవచ్చును." అని అమెరికాలో భారత రాయబారి శ్రీమతి విజయలక్ష్మి పండిట్ అన్నారు.

శ్రీమతి విజయలక్ష్మి ఇక్కడ ఒక రెండురోజులు ఉంటారు. ఈ రెండురోజుల్లోను ఆమె కొన్ని ప్రసంగాలు ఇవ్వబోతున్నారు. నిన్న ఆమె భారతీయకళా ప్రదర్శనం ప్రారంభిస్తూ ఇల్లాగ చెప్పారు. "భారతప్రభుత్వం నేడు అనేకసమస్యలు ఎదుర్కోవలసి ఉన్నది. అనేకమైన అల్లకల్లోలాలనించి భారతదేశం క్రమంగా బయటపడుతున్నది. అందుచేతనే భారతదేశం పరిశ్రమలు జాతీయం చెయ్యడంలో అంతగా శ్రద్ధవహించడంలేదు.

ఇండియా కమ్యూనిజాన్ని పూర్తిగా పరిత్యజించిందని నా దృఢవిశ్వాసము. కమ్యూనిజాన్ని ఎదుర్కోవడానికి గూడా ఇండియా చాలా తోడ్పడింది. అయితే దేశంలో సంపదను వృద్ధిచేసి ప్రజల జీవన ...

## పూరీ జగన్నాథంలో నిజమైన కమ్యూనిజం

### రాజాజీ ప్రశంస

పూరీ, డిసెంబరు 3: జగన్నాథ దేవాలయంలో స్వామికి భోగం తయారుచేసి అది తక్కువ ఖరీదుకు పంచిపెట్టడం నిజమైన కమ్యూనిజమనీ, ఈ ఆచారం బహు పురాతన కాలం నుంచీ నడుస్తున్నదనీ గవర్నరు జనరల్ రాజగోపాలాచారిగారు ఈ వేళ చెప్పారు.

గవర్నరు జనరలు పత్రికా విలేఖరుల సభలో ఈ మాటలు చెప్పారు. ఆయన ఇంకా ఇలాగ అన్నారు. "జగన్నాథ దేవాలయంలో పేద ప్రజలకు చాలా తక్కువ ఖరీదు ఆహారం ఇచ్చే ఆచారం చాలా ప్రశంసనీయమైనది. 3 అణాలకు పేదవారికి కావలసినంత ఆహారం లభిస్తున్నది. మిగిలిన ముఖ్య ప్రదేశాలన్నింటిలోను ఇల్లాంటి ఏర్పాటు చేయించడం చాలా మంచిదని నా అభిప్రాయం. ఇక్కడ ఆహారం చాలా పరిశుభ్రంగాను, రుచిగాను ఉంది. ఇక్కడ పాకశాలలో వెయ్యి మంది వంటవారు పనిచేస్తారు. వీరికి జీతాలు ఇవ్వరు కాని, ప్రజలకు ఆహారం విక్రయించినందుకు వీరికి ఉచితంగా ...

# రాష్ట్రములలోనూ, సంస్థానాల్లోనూ ఉన్న 15000 'లంకల' పరిష్కారం

## తదనుగుణంగా సరిహద్దులను మార్పు చేయడానికి ఢిల్లీ సభ సమ్మతి

న్యూఢిల్లీ, డిసెంబరు 3: ఇప్పుడు వివిన రాష్ట్రములలోను, సంస్థానములలోను అన్యరాష్ట్రములకు, సంస్థానములకు చెందిన భూభాగములు, లంకలవంటివి 15 వేలు కలవు. (ఉదా మునగాల: చుట్టు నైజాము సంస్థానము, మధ్య భారతభూభాగముగు మునగాల) ఇవి కొద్ది ఎకరములనుండి వందచదరపుమైళ్లవరకు వైశాల్యము కలిగియున్నవి. వీని భవిష్యత్తునుగూర్చి విచారించుటకు 15 రోజుల నుండి యిచ్చట ఒక సభ జరుగుచున్నది. ఈ లంకలను రద్దుచేసి పరిసర భూభాగములో కలిపివేయు సిద్ధాంతమును స్థూలముగా సభవారు అంగీకరించిరి. వీనిని రద్దుచేసి పరిసర ప్రాంతములలో కలిపివేసినయెడల పరిపాలనము సుకరమగునని సభవారు తలచిరి.

ఈ సమస్యతోపాటు సంస్థానముల, రాష్ట్రముల సరిహద్దులను మార్చి వానిని న్యాయసమ్మతమైనవిగా చేయు విషయమును గూడ సభవారు విచారించిరి. ఈ సరిహద్దుల మార్పు ఈ మాసాంతము లోపుగా పూర్తియగునని యనుకొనుచున్నారు. ఈ పనిపూర్తికాగానే భారతదేశము యొక్క క్రొత్త పటము జారీచేయబడును.

ఈ సభకు సంస్థానముల శాఖ సలహాదారుడు శ్రీ వి. పి. మీనన్‌గారు అధ్యక్షతవహించిరి. వివిధరాష్ట్రముల, సంస్థానయూనియనుల, మైసూరు ప్రతినిధులు ఈ సభలో పాల్గొనిరి. తూర్పు రాష్ట్రములగు బెంగాలు, ఒరిస్సా, బీహారు ప్రతినిధులు ఈ సభకు రాలేదు. ఎందువల్లననగా ఆ రాష్ట్రములలో యీ సమస్య ఎక్కువగాలేదు.

సభవారి నిర్ణయమును ఆయా రాష్ట్రములు సంస్థానములు ధృవపరుపవలసియుండును. ...

## వ్యవసాయ సలహా సంఘంవారి సూచనలు

న్యూఢిల్లీ, డిసెంబరు 3: భారత వ్యవసాయ పరిశోధనా సంఘము యొక్క సలహా సంఘంవారు ...

# డాలరు ప్రాంతాలకు భారతదేశ ఎగుమతులలో అభివృద్ధి

న్యూఢిల్లీ, డిసెంబరు 3: "అమెరికా ప్రభృతి అరుదు కరెన్సీ ప్రాంతాలకు మనం ఇప్పుడు బాగా ఎగుమతిచేయగలుగుతున్నాం. అవి ఇప్పుడు కొంచెం హెచ్చుస్థాయిలో పడుతున్నాయి." అని వాణిజ్యశాఖ తాలూకు ఉద్యోగి ఒకడు వెల్లడిచేసారు.

తేయాకు, సుగంధద్రవ్యాలు, మాంగనీసు, జీడిపప్పులు ఇవి ఇప్పుడు బాగా ఎగుమతి అవుతున్నాయి.

1948 లో ఇండియా అమెరికా ప్రభృతి అరుదు కరెన్సీ ప్రాంతాలకు 16,500 టన్నుల తేయాకును ఎగుమతి చేసింది. ఈ సంవత్సరం జనవరిదగ్గరనుంచి సెప్టెంబరుదాకా లెక్కలు తేలిస్తే, 15,874 టన్నుల తేయాకు ఎగుమతి అయినట్లు వ్యక్తపడింది.

ఇందుకు కారణం ఇచ్చేసరుకు మంచి ...

# "చైనాలో కలిగినమార్పులవల్ల భారత దేశానికి మహాపద్రవంఏర్పడింది"

## శాంతిభద్రతల రక్షణ: అస్సాంప్రధాని ఉద్బోధ

గౌహతి, డిసెంబరు 3: అస్సాం ప్రధాని గోపీనాథ బార్డోలాయ్ నిన్న సాయంత్రం ఇక్కడికి 35 మైళ్ల దూరంలో ఉన్న ...

దేశంలో విధ్వంసకచర్యలను ప్రోత్సహించవద్దని హెచ్చరిస్తూ ఎవరైనా విధ్వంసక చర్యలు జరిపితే వారిమీద అతి కఠినమైన చర్యలు ...

## భారత రాజ్యాంగం

## తైమ్సు వ్యాఖ్యానం

లండన్, డిసెంబరు 3: 'టైమ్సు' పత్రిక భారతదేశ నూతన రాజ్యాంగం ...

## ప్రపంచ బ్యాంకుకు పరిష్కారార్థం దరఖాస్తు

...

(3వ పేజీ చూడుడు)

(3వ పేజీ చూడుడు)

# అధికాహారోత్పత్తి కృషి

## నూతులు త్రవ్వుటకు తిరిగి ద్రవ్యసహాయం

చెన్నపట్నం, డిశంబరు 2: రాష్ట్రంలో అధికాహారోత్పత్తి స్కీము అనుసరించి నూతులు త్రవ్వుటకుగాను మదరాసు ప్రభుత్వము ద్రవ్యరూపముననొసగే సబ్సిడీ యికమీదటకూడా నివ్వటానికి ఇండియా ప్రభుత్వము అనుమతించినది. ద్రవ్యరూపమున నొసగబడిన మొత్తములు చాలా సందర్భములలో దుర్వినియోగమగుచున్నదని తెలిసి ఇండియా ప్రభుత్వము నగదు సబ్సిడీ మానివేయవలెనని ఇదివరకు సలహా నొసగినది. ఇండియా ప్రభుత్వ ఆహార కమిషనరు శ్రీ ఆర్. కే. పటేల్‌గారు ఇటీవల నగరమునకు వచ్చినపుడు చెన్నరాజధానిలో నూతుల సబ్సిడీ మొత్తములు దుర్వినియోగమైన కేసులు చాలా స్వల్పముగా నుండుటచే పాత నగదు సబ్సిడీ పద్ధతే అనుసరించుటకు అనుమతించి మదరాసు ప్రభుత్వమునకు ప్రత్యేకముగా గ్రాంటు నివ్వవలెనని రాష్ట్రప్రభుత్వము కోరెను. అందుకు ఇండియా ప్రభుత్వము వారిపుడు అంగీకారము తెలిపియున్నారు.

# ధాన్యం ధరలు

మదరాసు, డిశంబరు 2: గ్రామములలో పురిపద్ద ధాన్యం గరిష్టధరలను నిర్ణయించి మదరాసు ప్రభుత్వము నేడు అసాధారణ గెజెటులో ప్రకటించినది.

ఈ ధరల తగ్గింపువలన కొనుగోలుదార్లకు స్థూలబియ్యం 5% తక్కువధరకు గిట్టుబాటు అవుతుంది. మొదటి రకమునకు 3 అణాలు, రెండవరకమునకు 4 అణాలు ధాన్యంధర తగ్గించవలెనను ప్రభుత్వ నిర్ణయము ననుసరించి ధాన్యం ధరలలో మార్పులు చేయబడెను.

1949 జూలై 1 దరిమిలా సేకరించు ధాన్యము, బియ్యములపై సర్‌చార్జి నితగ్గించవలెనని ప్రభుత్వము నిర్ణయించినట్లు ఈ క్రొత్తకంట్రోలు ఉత్తర్వులో ఉదహరించబడెను. ఈ తేదీకి పూర్వము ధాన్యము మ 1-కి 8 అణాలు, బియ్యం మ 1-కి 12 అణాలు చొ॥న బోనసు సర్‌చార్జివుండెను. ఇప్పుడు అది తగ్గించి ఆహారశాఖ ఖర్చుల నిమిత్తం ధాన్యం మ 1-కి 3½ అణాలు, బియ్యం మ 1-కి 5 అణాలు సర్‌చార్జి వసూలు చేయుదురు.

ఈ క్రొత్తకంట్రోలు ఉత్తర్వు 1949 డిశంబరు 4 నుండి అమలుకు వస్తుంది. సప్లయి శాఖ ఉద్యోగులు ఖరీదు చేయు ధాన్యము, జొన్న వి త్తనములకు ఇదివర్తించదు.

మొదటి షెడ్యూలులో గ్రామములో మణుగు ధాన్యంధర జిల్లాలవారీగా ఇచ్చిరి.

| జిల్లా | మొదటిరకం | రెండవరకం |
|---|---|---|
| విశాఖపట్నం | 9- 7-9 | 8-14-9 |
| తూర్పుగోదావరి | 8- 6-6 | 7-14-3 |
| పశ్చిమగోదావరి | 8- 6-6 | 7-14-3 |
| కృష్ణా | 8- 6-6 | 7-14-3 |
| గుంటూరు | 8- 6-6 | 7-14-3 |
| కర్నూలు | 8-13-0 | 8- 5-6 |
| బళ్లారి | 9- 0-0 | 8- 8-6 |
| అనంతపురం | 8-13-0 | 8- 9-6 |
| కడప | 9- 4-9 | 8-12-6 |
| నెల్లూరు | 8-11-9 | 7-14-3 |
| చెంగల్పట్టు | 8- 2-9 | 7-11-3 |
| ద. ఆర్కాటు | 8- 2-6 | 7-10-6 |
| చిత్తూరు | 9- 1-6 | 8- 9-9 |
| ఉ. ఆర్కాటు | 8- 5-3 | 7-13-6 |
| సేలం | 8-13-0 | 8- 5-3 |
| కోయంబత్తూరు | 8-15-3 | 8 -7-9 |
| తిరుచినాపల్లి | 8- 4-9 | 7-12-9 |
| తంజావూరు | 8 -2-0 | 7-10-3 |
| మధుర | 8-14-6 | 8- 6-9 |
| రామనాడ్ | 9- 3-6 | 8-14-6 |
| తిరునల్వేలి | 8-11-6 | 8- 3-9 |

మలబార్, దక్షిణ కనరాలలో స్థానిక కొలత ప్రకారం ధర నిర్ణయించిరి. నీలగిరిలో మొదటిరకమునకుమాత్రం రు. 9-0-0 లు మణుగు ధర నిర్ణయించిరి.

కలెక్టరు ఆఫీసులలో ప్రదర్శించిన పట్టీ ననుసరించి వివిధజిల్లాలలోని ధాన్యము మొ

# జాతీయ పతాక నిబంధనలు

మద్రాసు, డిసం 3:

భారతజాతీయ పతాకము దేశం యొక్క గౌరవచిహ్నము. దానిని అప్రస్తుతంగా ఉపయోగించరాదని ఇండియా ప్రభుత్వంవారు కొన్ని నిబంధనలు గావించిరి.

ఇండియాలో జాతీయ పతాకమును యీ దిగువరీతిని ఎగురవేయవచ్చును:—

(1) భవనములపై—ప్రభుత్వ భవనాలపైని, కచ్చేరీలు, మునిసిపాలిటీలపైని మంత్రులు, శాసనసభల అధ్యక్షులు, డివిజన్ల కమిషనర్లు, డిప్యూటీ కమిషనర్లు, జిల్లా కలెక్టర్లు మునసబుల యిండ్లపైని ఎగురవేయవచ్చును.

గవర్నరు జనరలు, గవర్నరులకు వారి స్వంతపతాకము లుండును. వారి యిండ్లపైనవి ఎగురవేతురు.

గవర్నరుజనరలు, ప్రధానమంత్రి రాష్ట్రాలకు వచ్చినపుడు గవర్నరు ఇంట దిగుదురు. అపుడు గవర్నరు జనరలుగారి పతాకము లేదా ప్రధానమంత్రికి వేరే పతాకం లేనపుడు జాతీయపతాకము, గవర్నరు మందిరంపైని లేదా అతిథి యున్న భాగంపైనిగాని, గవర్నరు పతాకంతోపాటు ఎగురవేయువచ్చు. గవర్నరు లేనపుడు గవర్నరు జనరలుగాని ప్రధానమంత్రిగాని రాష్ట్రగవర్నరు భవనమునందున్నచో గవర్నరుజనరలు పతాకం లేదా భారతజాతీయ పతాకము ప్రధానంగా నుంచవలెను. విదేశాలందున్న భారతప్రభుత్వప్రతినిధులు తమ బసలపైని, కచేరీలపైని భారత జాతీయపతాకం ఎగురవేయాలి.

సరిహద్దుప్రాంతాల కొన్ని తావులందు పతాకం స్థాపించవచ్చు. రాజప్రముఖులు తమ పతాకంతోబాటు జాతీయపతాకం భవనాలపై నుంచవచ్చు.

సైనిక నావిక విమాన దళములందు వారికిగల ప్రత్యేక నిబంధనల ప్రకారం ఎగురవేయవచ్చు.

స్వాతంత్ర్య దినోత్సవం, జాతీయ వారం, జనవరి 26, గాంధి మహాత్ముని జన్మదినము మున్నగు జాతీయోత్సవ దినములందు, యధేచ్ఛగ పతాకం వాడవచ్చు.

కారులపైని: మోటారు కారులపైని జాతీయపతాకం ఉంచుకునే హోదా ఈ దిగువవారికే యుండును:- మంత్రులు, శాసనసభాధ్యక్షులు, రాష్ట్ర, కేంద్రప్రభుత్వ మంత్రులు డిప్టీమంత్రులు, రాజ్యాంగ పరిషత్తు అధ్యక్షుడు.

విదేశాలందుండు ఇండియా ప్రభుత్వ ప్రతినిధులు, రాజులు, రాజప్రముఖులు, గవర్నరులు, గవర్నరు జనరలువీరికి స్వంత ప్రత్యేక పతాకములుగలవు. వారు వాటినే వాడెదరు. రాష్ట్ర గవర్నరులు యితర రాష్ట్రములకు పోయినచో జాతీయ పతాకమే కారుపై ఉపయోగించవలెను.

ఇతరు లెవరు ఉత్సవదినాలలో తప్ప కారులపై జాతీయపతాకం వాడరాదు.

---

దటి రెండవ తరగతిగా విభజించియున్నారు. ధరలు సివిల్ సప్లయివారి ప్రమాణము ననుసరించి నిర్ణయించబడెను.

తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి కృష్ణా, గుంటూరు నెల్లూరు, తంజావూరు, చిదంబరం తాలూకాలు తప్ప షెడ్యూలు 1 కాలము (1) లో ఉదహరించిన గ్రామములలో అందచేయవలసిన ధరకాలములు (2) (6) లో తెలిపిన ధరలకు మించరాదు. ఇల్లు, ట్రాకు వరకుచేసిన 3 మైళ్లు అంతకులోపు ఉన్నప్పుడు [illegible]

[illegible]

# చేనేతపారిశ్రామికుల నిరుద్యోగ నివారణకు ప్రభుత్వ సహాయం

## ప. గో. జిల్లా చేనేత సహకారసంఘాల సూచనలు

ఏలూరు, డిసెంబరు 2: పశ్చిమ గోదావరిజిల్లా చేనేత సహకారసంఘాల ప్రతినిధుల సమావేశం, ఏలూరులో బందా పట్టాభిగారి అధ్యక్షతను మొన్న జరిగెను.

రీజనల్ మార్కెటింగు ఆఫీసరు జి పున్నయ్యగారు చేనేత సహకార సంఘాల సబ్ రిజిస్ట్రారు వి. సూర్యనారాయణగార్లు, జిల్లాలోని సీనియర్ యిన్స్పెక్టర్లు ఆ టగ్గు సభలో పాల్గొన్నారు. సభకు 100 మంది ప్రతినిధులు హాజరయ్యారు పశ్చిమ గోదావరిజిల్లా చేనేతకాంగ్రెసు అధ్యక్షులు తాళ్ళ కోటి వీరయ్యగారు మాటాడుచూ ప్రస్తుత పరిస్థితులలో ప్రభుత్వంవారు అమలు జరుపబోవు రిలీఫ్ స్కీముయొక్క అవశ్యకతను గురించియు, వాటిని కొన్ని మార్పులతో సభవారు అంగీకరించవలసిన అవసరమును గూర్చియు స్పష్టంగా చెప్పినారు. తరువాత గుడిమెట్ల గంగరాజుగారు ప్రభుత్వమువారి, రిలీఫ్ స్కీమును విమర్శించుచూ మాట్లాడిన మీదట, ఏలూరు గ్రామ చేనేత కాంగ్రెసు ప్రెసిడెంటు తాడిశెట్టి వీరన్నగారు స్థానిక యిబ్బందులనుగూర్చియు, చేనేత సహకార సంఘాలలో జరుగుచున్న అవకతవకలనుగూర్చియు మాట్లాడినారు. తరువాత భగ్గేశ్వరం చేనేత సహకార సంఘం నుండివచ్చిన శిద్దాని కోటివీరభద్రంగారు చేనేత పరిశ్రమ రక్షణనుగూర్చి మాట్లాడిన మీదట, రీజనల్ మార్కెటింగ్ ఆఫీసరు జి పున్నయ్యగారు చేనేత సహకార సంఘాల అవశ్యకతనుగూర్చియు, రిలీఫ్ స్కీము వివరాలనుసరించియు విపులంగా ప్రతినిధులకు తెలియజేసినారు. తరువాత సభలో యీ క్రింది తీర్మానములు ఏకగ్రీవంగా ఆమోదింపబడెను.

ప్రభుత్వంవారు ప్రకటించిన రిలీఫ్‌స్కీమును అమలుపర్చుటకు అంగీకరించుచూ, దిగువ సూచనలను ప్రభుత్వంవారు గమనించి ఆ ప్రకారం తమ స్కీమును, మార్చుకొనవలెనని యీ సభవారు కోరుచున్నారు. సభ్యుల కిచ్చే రు. 25/-లు షేరు ధనం ఉచితంగా యివ్వవలెను. మజూరీ లడ్డీ 1-కి రు. 0-8-0 వరకు పెంచవలెను. సభ్యులకు నేసినంత నూలు యివ్వవలెను. సభ్యులు నేయగల రకాలనే నేయించవలెను. ప్రభుత్వంవారు చేనేత సహకార సంఘాలను ఉచితంగా ఆడిటు చేయించి చేనేత సహకారోద్యమమును అభివృద్ధిచేయగలందులకు యీ సభవారు కోరుచున్నారు.

ఇటీవల ఆంధ్రజిల్లాలలో గాలి తుపాను వల్ల నష్టపడిన చేనేత పారిశ్రామికులకు ఈ దిగువ సూచనల ప్రకారం ప్రభుత్వం వారు వెంటనే ఆర్థిక సహాయం చేయవలెనని కోరుచున్నారు. మరజంత్రం నష్టపడ్డ వారికి రు. 100/-లు యివ్వవలెను. మగ్గములు వాటి పరికరములు పోయినవారికి రు. 25/-లు యివ్వాలి. యిండ్లు పడిపోయిన వారికి రు. 150/-లు యివ్వాలి. చేనేత సహకార సంఘాలలో పనిచేయు మెంబరు వారిషంచే షేరు ధనముల నాధారం [illegible]

[illegible]

## మదరాసు కార్మిక సలహా సంఘ ద్వితీయ సమావేశం

మదరాసు, డిశంబరు 2: మదరాసు కార్మిక సలహాసంఘం నేడు ప్రభుత్వ కార్యాలయములో సమావేశమై కార్మిక సమస్యలను గురించి చర్చించెను. లేబరు మంత్రి శ్రీ హాలాహర్వి సీతారామ రెడ్డిగారు అధ్యక్షత వహించిరి

చర్చలో ఒక ప్రతినిధి ముఖ్యమైన పరిశ్రమలకు యజమానులు, కార్మికుల అభిప్రాయములను ప్రభుత్వమునకు విశద పరచుటకు అంతర్జాతీయ కార్మిక సంఘము, ఇండియా ప్రభుత్వమువారి పారిశ్రామిక కమిటీల మాదిరిగ స్థాయిసంఘములను నియమించవలెనని సూచించినట్లు తెలియుచున్నది.

కార్మికులకు ఉచితముగా న్యాయ సౌకర్యములు కలుగ చేయవలెననీ, తీర్పులను ఏపక్షమూ ఉల్లంఘించ కుండునట్లు తగుచట్టము చేయవలెననీ దుకాణములు, వ్యాపార సంస్థచట్టము, ఫాక్టరీల చట్టములకు కార్మిక సంఘముల ప్రతినిధులతో సంప్రదించకుండా మినహాయింపులు ఇవ్వకూడదని సూచించినట్లు తెలియుచున్నది.

కార్మికులకు గృహములను నిర్మించు విషయమై కార్మిక యజమానుల ప్రతినిధులు ఈ విషయములో ప్రభుత్వము ఏమి చేయదలచినదీ తెలుసుకొన గోరిరి.

ఈ విషయములన్నీ మరో సమావేశములో సమగ్రముగా చర్చించవలెనని నిర్ణయించిరి.

# కలకత్తాలో విమాన ప్రమాద వివరములు

## సర్దార్ బలదేవుసింగ్‌గారి ప్రకటన

ఢిల్లీ, డిసెంబరు 2: ఇటీవల కలకత్తాలో రాయలు యుద్ధవిమానదళము తాలూకు విమానములు ఆకాశములో ఎగురుచుండగా ప్రమాదం సంభవించి విమానములు ధ్వంసమయ్యెను. ఈ విమాన ప్రమాదమును గూర్చి నేడు ఇండియాప్రభుత్వ సైనిక శాఖామంత్రి బలదేవ సింగుగారు పార్లమెంటులో యీ క్రింది వివరములను ఒక ప్రశ్నకు సమాధానంగా చెప్పిరి.

రాయలు యుద్ధవిమానములు ఒక జట్టుగా నవంబరు 16 తేదీని ఎగురుచుండెను. అప్పుడు ఒక రాబందు విమానాలకు ఎదురుగావచ్చి ఒక విమానంతో ఢీకొనెను. ఆ విమానము ప్రక్కనున్న మరొక విమానమునకు ఢీకొనెను. ఈ సంఘటనలో ఆ రెండు విమానములు ధ్వంసమై క్రిందకూలెను. ఆ విమానములు అస్పాతులోని కుమ్మరామునుండి కలకత్తా విమానాశ్రయమునకు పోవుచుండెను. వైమానికులు అందరూ బాగా శిక్షణ పొందినవారే. ఈ ప్రమాదంలో 8 మంది మరణించిరి. ఒక విమానచోదకుడు కూడా ఆ 8 మందిలో కలడు. 13 మందికి తీవ్రగాయములయ్యెను. 20 మంది కొలది గాయములయ్యెను.

ఈ ప్రమాద సందర్భము లనుగూర్చి విచారణచేయుటకై ఒక విచారణ మండలి నియమింపబడెను. జననష్టం సొత్తు నష్టంగూర్చి విచారణచేయుటకు మరొక విచారణ మండలి నియమింపబడెను.

విమానములు క్రిందపడుటవల్ల కొన్ని భవనములకు నష్టముకలిగెను. ఈ నష్టమునకు ఏదో కొంత నష్టపరిహారమును యివ్వవలెను. గత యుద్ధకాలంలో యిటువంటి నష్టములకు పరిహారం యివ్వబడెను.

# 'హరిజన వసతిగృహాల్లో హరిజన మానేజర్లనే నియమించాలి'

## పశ్చిమగోదావరి జిల్లా హరిజన క్షేమాభివృద్ధి కమిటీ తీర్మానం

ఏలూరు, డిసెంబరు 2: రాష్ట్రంలోని హరిజనవసతి గృహాల్లో క్రైస్తవ మేనేజర్లు నియమింపబడిన సందర్భాలలో, ఆయా వసతిగృహాల్లో, అంతకంతకు క్రైస్తవబాలురే అధికంగా చేర్చుకోబడుతున్నారనీ, హరిజనబాలుర అవకాశాలు సన్నగిల్లుచున్నాయనీ, అంతేకాకుండా మేనేజర్లు, వసతిగృహాల్లోని హరిజనబాలురను క్రైస్తవ మతంలోకి చేరుస్తున్నారనీ, అభిప్రాయపడుతూ, హరిజన వసతి గృహాలలోని క్రైస్తవ మేనేజర్లను వెంటనే తీసివేసి, హరిజనులనే వేయవలసిందనీ, హరిజన్ వెల్ఫేర్ డైరెక్టరు వారిని కోరుతూ, పశ్చిమ గోదావరిజిల్లా హరిజన్ వెల్ఫేర్ కమిటీవారీరోజున సమావేశమై తీర్మానించారు. ఆ తీర్మానంలోనే, ప్రభుత్వాని కవసరమనిపిస్తే, క్రైస్తవ బాలురకు ప్రత్యేకంగా వసతి గృహాలను స్థాపించవలసిందని కూడా సూచించబడింది. సమావేశానికి ప. గో. జిల్లాకలెక్టర్ జనాబ్ షేక్ అహమ్మద్ అధ్యక్షత వహించారు. ఏలూరులోనూ యితరచోట్లా తాటాకు బుట్టలు అల్లి జీవించే హరిజనులకు ఒక సహకారసంఘం స్థాపింపవలసిందిగా కో ఆపరేటివ్ సొసైటీల డిప్యూటీ రిజిస్ట్రారును కోరుతూ తీర్మానించారు.

పల్లెప్రాంతాలలోని హరిజనులవలెనే పట్నప్రాంతాలలోని హరిజనులకూడా కడు బీదలేగనుక, పల్లెప్రాంతీయ హరిజనులకు ఉచిత నివేశనస్థలముల నిచ్చుటకు ప్రభుత్వంవారు చేసిన పద్ధతి పట్నప్రాంతీయ హరిజనులకూ యివ్వవలెనని ప్రభుత్వంవారినికోరుచూ తీర్మానించారు. ఈలా నివేశనస్థలా లివ్వడంలో పల్లపు భూములలో 3 సెంట్లు నుండి 4 సెంట్లకు, మెరక ప్రాంతాలలో 5 సెంట్లనుండి 6 సెంట్లకూ నివేశన స్థల పరిమితిని పెంచవలెనని కోరారు.

జిల్లాలో తుపాను బాధితులైన హరిజనులకు సహాయం చేయడంలో ప్రత్యేకశ్రద్ధ కనపరుస్తున్న జిల్లా కలెక్టరుగారి సేవకు ధన్యవాదాలను తెలియపరిచారు.

మృతకళేబర,భక్షణ మను నిషేధిస్తూ ప్రభుత్వంవారు జారీచేసిన ఉత్తర్వులను హరిజనులలో అధికంగా ప్రచారం జరిపేందుకు తీర్మానిస్తూ పైఉత్తర్వులు వివరిస్తూ 5000 కరపత్రాలు అచ్చువేసి పంచేందుకు నిర్ణయించారు. (స్వ. వి)

## ఫిర్కాభివృద్ధి ఆఫీసర్లు

చెన్నపట్నం, డిసెంబరు 3: ఫిర్కాభివృద్ధి శాఖలో ఇప్పుడు 17 గురు బ్రాహ్మణులు ఉన్నందున, కులాను సారముగా ఉద్యోగములు పర్దుబాటు ఏర్పాటును ఆలోచించుచున్నానని ఫిర్కాభివృద్ధి మంత్రి పరమేశ్వరన్ గారు పత్రికా ప్రతినిధులతో తెలిపిరి. ముస్లింలాపన సభ్యుడు ఈ విషయమై అడిగినపుడు డా॥ సుబ్బరాయన్‌గారు కులానుసారముగా సర్దుబాటు చేసెదమని హామీ యిచ్చి ఉన్నారని మంత్రిగారు తెలిపిరి.

## ఆంధ్రదేశంలో ఖాదీఉత్పత్తి

చెన్నపట్నం, డిసెంబరు 3: ప్రభుత్వ ఖద్దరు ప్రణాళికను సంబంధించి ఆంధ్ర ప్రాంత లెక్కలు విడిగా తయారు చేయబడినటుల తెలియుచున్నది.

## తుపానునిధికి రూ. 200

బాపాలాలు (నగల) కంపెనీ వారు రూ. 200 గవర్నరుగారి ఆంధ్ర తుపాను సహాయనిధికి యిచ్చిరి.

కె. ఎల్. నరసింహారావుగారు (విజయవాడ) రాష్ట్రీయ ప్రత్తిసంఘము సభ్యులుగ ఆంధ్ర వాణిజ్యసంఘమునుండి ఎన్నుకొనబడిరి.

# "ప్రజాస్వామ్య మంటే ఏమిటో నిర్ధారణ చెయ్యాలి"

## ప॥ బెంగాలు గవర్నరుగారి స్నాతకోపన్యాసం

అలహాబాదు, డిసెంబరు 3: పశ్చిమ బెంగాలు గవర్నరగు డా॥ కైలాసనాథ కట్జూగారు నేడు అలహాబాదు విశ్వవిద్యాలయ పట్టభద్రులకు స్నాతకోపన్యాసమొసంగుచు ఇటు చెప్పిరి.

ఆసియా ఖండ లో యున్న మనకు పరస్పర విరుద్ధములైన రాజకీయ ధర్మ సూత్రముల ఘోష ఎక్కువగా ఉంది. ఈ భిన్నతత్వోపదేశములను యీ తరమువారు పరున్వయింపవలసియున్నది. ఎవరిని మాచినను ప్రజాస్వామ్య ధర్మములను ఉద్ధరించుట కొరకే కంకణము కట్టుకొనియున్నామని ప్రతిజ్ఞలుపల్కుచున్నారు. ఈ ప్రజాస్వామ్య శబ్దమునకు ఒక్కొక్కరొక్కొక్క విధముగ అర్థము చెప్పుచున్నారు. కనుక ప్రజాస్వామ్య శబ్దమునకు సరియైన అర్థ నిర్వచనం నిర్ధారణ చేయవలెను. కమ్యూనిజం, ఫాసిజం, సోషలిజం, కాపిటలిజం, యివన్నీ అనేక విధములైన భిన్న భిన్న ఆలాపనలుగా ఉడివి నొదవగా ఉన్నవి. పై చెప్పిన వానిలో ఒక్కొక్క రాజకీయ తత్వము సర్వావస్థ నిరూపించిని యని చెప్పబడుచున్నది. ఒక్కొక్క ఆర్థిక విధానమునకు అనుగుణముగా ఏర్పడినఒక్కొక్క సాంఘిక నీతి సూత్రావళి కూడా ఏర్పడియున్నది. పై చెప్పిన కమ్యూనిజంవగైరా తత్వములను ఉపదేశించేవారు ప్రపంచమంతయును తమ తత్వములే అనుసరింపవలె నంటూరు.

భారత జాతికి ఆయికమత్య దీక్ష యిటీవల కలిగినంతగా యిదివర కెన్నడును కలుగలేదు. మన నూతన రాజ్యాంగ విధానమునందు కేంద్రప్రభుత్వమునకు ఎక్కువ అధికారము లివ్వబడినవి. అయితే, భారత ప్రజానీకము యొక్క సంకల్పము ననుసరించియు, సమ్మతితోను కేంద్ర ప్రభుత్వము తన అధికారమును చలాయింపగలదు. ఈ కాలంలో బలాత్కారంగా దౌర్జన్యంగా ఒకరు యింకొకరిపై అధికారం చలాయించుట అసంభవం. కేంద్ర ప్రభుత్వం బలత్తముగా యుంటేనే దేశానికి భద్రతయును పురోభివృద్ధియును కలవు.

వ్యవహారిక ప్రభుత్వ భాషగా ఏది ఉండినప్పటికీ చిట్టచివరకు ఎప్పటికైనను భారత జాతిని ఏకముగా చేయగలిగినది సంస్కృతమే భాషగాని మరొకటి కాదు. హిందీని దేశమంతటను వ్యాప్తిలోనికి తీసికొని రాగల్గినది. సంస్కృతమే గాని మరొకటి కాదు. పాఠశాలలందును విశ్వవిద్యాలయములలోను సంస్కృతమునకు గౌరవ స్థానము త్వరలోనే లభించగలదు.

ప్రపంచములో ఏ దేశమైనను ఆత్మరక్షణ కొరకే పోరాడినప్పటికీ సర్వనాశనమగుటకు సిద్ధపడవలసిన పరిస్థితి ఏర్పడుచున్నది. అందువల్ల గాంధీ బోధించిన అహింసా సిద్ధాంతమే ఉత్తమమైనదనెడి భావం ప్రబలముగుచున్నది. కాని ఆ గాంధీ సిద్ధాంతమును అనుసరించి ఆచరణలో పెట్టుటకు పూనుకొనెడి దేశం ఏది?

అహింసా ధర్మము నవలంబించిన పేదవాడును దుర్బలుడును కూడా అజేయుడగుచున్నాడు.

ఏ దేశమునకు ఏ జాతికి ఏ రాజకీయ తత్వము సమాజ సిద్ధముగా వర్తింపగలదో అట్టి దానినే ఆజాతి స్వీకరింపగలదు. భగవద్గీతలో చెప్పబడిన కర్మయోగ సిద్ధాంతమే మన జాతికి వ్యక్తికి స్వయంగ శ్రేయను కాగలదు.

# హైద్రాబాద్‌లో వయోజన ఎన్నిక పద్ధతిమీద ఓటర్ల జాబితాల ప్రకటన

## నిజాం నవాబు, లాయకాలీ, కాశిం రజ్వీలతో సహా 87 లక్షలమంది పేర్ల నమోదు

హైద్రాబాద్, డిసెంబరు 3: హైద్రాబాద్ సంస్థాన మంతటా నేడు సంస్థాన రాజ్యాంగ పరిషత్తు ఎన్నికలలో పాల్గొను ఓటర్ల చిత్తు జాబితాలు ప్రకటింపబడినవి. వయోజన ఎన్నిక పద్ధతిమీద తయారు చేయబడిన యీ జాబితాలలో 87 లక్షల పేరు నమోదు చేయబడినవి. నిజాంనవాబు 7 వ అసఫ్‌జా ఉస్మాన్ అలీఖాన్‌గారి పేరుకూడ యిందులో ఉంది.

ఇంతేగాక, ప్రస్తుతం కొన్ని నేరములకుగాను ప్రత్యేక న్యాయ విచారణ సంఘం ఎదుట విచారింపబడుచున్న సయ్యద్ కాశింరజ్వి, ఇంటి నిర్బంధంలో నున్న మాజీ ప్రధానమంత్రి మీర్ లాయకాలీ, ఆయన మంత్రివర్గ సభ్యుల పేర్లు కూడ పీటిలో నమోదు చేయబడినవి.

హైద్రాబాద్ ఎన్నికల కమిషనరు ఎస్. డబ్ల్యు. శివేశ్వర్కార్ గారు నేడు పత్రికావిలేఖరులతో ప్రసంగిస్తూ, జాబితాలలోని పేర్ల విషయమై ఎవరైనా ఆక్షేపణలు తెలియ జేయుగోరే యెడల నేటినుండి నెలరోజులలోగా ఆవిధంగా చెయ్యవలెనన్నారు. డిటెన్షన్‌లోగాని విచారణలోగాని ఉండినవారికి ఓటుచేసే అవకాశంలేదనీ కాని,ఎన్నికలుప్రారంభం కావటానికి ముందు విడుదలైనచో వోటు చెయ్యటానికి వీలుకలిగేటట్లుగా వారిపేర్లు ఓటర్ల జాబితాలలో నమోదు చెయ్యబడినవనీ ఆయన వివరించారు. సంస్థానంలోని వయోజను లందరిని ఓటర్ల జాబితాలలో నమోదు చేసే కార్యక్రమంలో దాదాపు 60 వేలమంది ఉద్యోగులు మూడు నెలలపాటు పనిచేశారు.

1940 లెక్కల ప్రకారం హైద్రాబాద్ జనాభా 160 లక్షలు. ఇందులో దాదాపు 87 లక్షలమంది వయోజనుల ఓటర్ల జాబితాలలో నమోదు చేయబడినారు. వీరు సంస్థానంలోని 137 ప్రాంతీయ నియోజక స్థానాలనుండి 200 మంది ప్రతినిధులను హైదరాబాద్ రాజ్యాంగ పరిషత్తుకు ఎన్నుకొంటారు.

ఈ 200 స్థానాలలోను 35 హరిజనులకు, 25 ముస్లిలకు, 8 కొండజాతివారికి ప్రత్యేకించ బడినవి.

## ఓటర్ల జాబితాలు

మదరాసు, డిసెంబరు 2: నూతన రాజ్యాంగముక్రింద వయోజన ఓటర్ల జాబితాలు జనవరి 27 న రాజ్యాంగము అమలు జరిగిన తరువాత ఒకనెలరోజులలో సిద్ధము అవగలవని తెలియుచున్నది. ఇంగ్లీషు, ఇతర భాషలలో ఓటర్ల జాబితాలు ఫిబ్రవరి ఆఖరుకు తయారు అగునని తెలియుచున్నది.

## హైద్రాబాద్‌లో గుడ్సురైళ్లకు సాయుధ దళముల రక్షణ

హైద్రాబాదు డిసెంబరు 3: నవంబరు 29 న గుడ్సురైలుబండిపైదాడి జరిగి రైల్వే ఇంజనీరు పెగాల్ హత్య చెయ్యబడిన కారణంగా ఇకనుండి గుడ్సుబండ్లకు కూడ సాయుధ దళముల రక్షణ ఏర్పాటు చెయ్యబడుతుంది. ప్రస్తుతం ప్రయాణీకుల రైళ్ళకు సాయుధ దళముల రక్షణ ఉన్నది.

## 5 గురు కాంగ్రెస్‌సేవకుల అరెస్టు

సికింద్రాబాద్ డిసెంబరు 2: హైద్రాబాద్ ప్రజారక్షణ నిబంధన 119 వ సెక్షనుక్రింద వనపర్తి సంస్థానంలో 5 గురుకాంగ్రెస్ సేవకులు అరెస్టు చేయబడినారని సంస్థాన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కార్యాలయానికి వార్తవచ్చింది. వీరిని మహబూబ్ నగర్ తీసుకొని పోయినారట.

## 'గాంధీజీవితం' పుస్తకం

### యువక విద్యార్థి రచన

సికంద్రాబాద్, డిసెంబర్ 2: చాకీ ప్రభుత్వ పాఠశాల విద్యార్థి సిద్ధేశర్ రాజ్ సక్సేనా అనునతడు 'గాంధీజీవితం' అను ఒక పుస్తకమును వ్రాసెను. భారత ప్రభుత్వ సమాచార శాఖ స్టేట్ మంత్రి ఆర్. ఆర్. దివాకర్ గారు తొలిపలుకు వ్రాశారు. హైదరాబాద్ ప్రభుత్వ విద్యాశాఖ వారు యీ పుస్తకమును ప్రచురించవచ్చని తెలుస్తున్నది.

## హైద్రాబాద్ ప్రభుత్వ మంత్రుల శాఖలు

సికంద్రాబాద్, డిసెంబరు 2: హైద్రాబాద్ ప్రభుత్వంలో మంత్రులకు యీ శాఖలు యివ్వబడినవని నేడు ప్రకటన చేయబడెను.

ఎం. కె. వెల్లోడీ, ప్రధాన మంత్రి జనరల్ పరిపాలన సైన్యం. డి. ఎస్. బాక్లే హోం, న్యాయ రైల్వే రాకపోకలశాఖలు. నవాబ్ జైన్‌యార్ జంగ్ బహదూర్ పబ్లిక్‌వర్క్సు ఆరోగ్యం, స్థానిక స్వపరిపాలన శాఖలు.

రాజాధోండీ రాజ్‌బహదూర్ కస్టమ్సు, ఎక్సైజు విద్య, పునరావాస శాఖలు ఎం. శేషాద్రి. రెవెన్యూశాఖ (ఎక్సైజు కస్టమ్సు మినహా) కాని రాజ్యాంగ పరిషత్తు ఎన్నికలతో సహా) సి. వి. ఎస్. ఆర్థిక వాణిజ్య పరిశ్రమల శాఖలు.

పి. హెచ్. కృష్ణారావు గ్రామ పునర్నిర్మాణము సప్లయి కార్మికశాఖలు.

# జర్మనీలో అమెరికా సేనలకు ఆటం యుద్ధ శిక్షణ

ఫ్రాంక్‌ఫర్ట్, డిసెంబర్ 1: జర్మనీలో ఉన్న అమెరికన్ సేనలన్నిటికీ ఆటందాడి నుంచి రక్షించుకునే శిక్షణ నివ్వవలసినదని త్వరలో ఉత్తరువు చేయవలసినదని, ఉత్తర బవేరియా రాష్ట్రంలోని కిట్సింగెన్‌లో ఆటం యుద్ధరక్షణను నేర్పే కేంద్రాన్నొకదానిని నెలకొల్పవలెననీ, నేడు హైడెల్‌బర్గ్‌లో సమావేశమయిన ఉన్నత అమెరికన్ సైనికోద్యోగులు నిశ్చయించారు.

కిట్సింగెన్ శిక్షణ కేంద్రంలో నివిల్ వాయు, క్రిమి యుద్ధ పద్ధతుల రక్షణలు కూడా తరవాత ప్రవేశ పెడతారు. అందులో తరచు 150 మంది ఉద్యోగులకు 6 వారాలు శిక్షణ ఇవ్వబడుతుంది.

సమావేశంలో పాల్గొనటానికి వాషింగ్టన్ నుంచి వచ్చిన ఆటం నిపుణులు ఇటువంటి శిక్షణ కేంద్రాలు మూడు అమెరికాలో నిర్వహించ బడుతున్నవని వెల్లడించారు.

"శరీరమంతా పూర్తిగా కప్పే దిట్టమైన వస్త్రాలు అటంకిరణాల ప్రమాదాన్ని చాలవరకు తగ్గించగలవు. ఆటం బాంబు ఆకాశంలోనే పేలినప్పుడు వచ్చే కిరణాలఉధృతం గోడలతో కొంతవరకు తగ్గించ బడ్డది. ఆటం కిరణాలతో నిండిన వాయువును కూడా దాటిపోయే వాగు ఉపయోగించ వచ్చును." అని ఆ నిపుణులు సమావేశాన్ని హెచ్చరించారు.

# నర్సాపురం తాలూకాలో రెవెన్యూమంత్రి పర్యటన

## తుపాన్ దెబ్బతిన్న ప్రాంతాల సందర్శనం

నర్సాపురం, నవంబరు 30: మద్రాసు ప్రభుత్వ రెవిన్యూశాఖామాత్యులు గౌ. హెచ్. సీతారామరెడ్డిగారు శ్రీమతి గంధం అమ్మన్నరాజా, మాగంటి బాపినీడు, అల్లూరి సత్యనారాయణరాజు, గొట్టుముక్కల వెంకన్న, మాగంటి సీతారామదాసు, యర్రమిల్లి నారాయణమూర్తి జిల్లా కలక్టరుగార్లతో కలసి మొన్న వుదయం లాంచి మీద తుపానుకెరటంవల్ల ఆపార నష్టమునకు గురియైన సముద్రప్రాంతమైన వేములదీవి, బియ్యపుతిప్ప గ్రామాలను చూశారు. నేటి వర్కు తాలూకా తుపాను కమిటీ కార్యదర్శి యర్రమిల్లి నారాయణమూర్తి మాజీఎమ్.ఎల్.ఏ, కలెక్టరు యం.పి.రాయప్ప నర్సాపురం కాలేజీ విద్యార్థులు అధ్యాపకులు యింతవర్కు చేసిన సేవలను మంత్రిగారు ప్రశంసించారు. తుపానుదెబ్బలో చనిపోయిన కుటుంబాలవారికి తమ సానుభూతి తెలియపర్చుచూ అక్కడ ముఖ్య వృత్తియైన చేపలు పట్టుకొనుట పునరుద్ధరించుకొనుటకుగాను వలల నిమిత్తం 20000 రూపాయలు గవర్నమెంటువారు యివ్వనున్నారనియూ వెంటనే మంచినీటి చెరువు బాగుచేయించి తాగుటకు నీరు అందచేస్తామనియూ గ్రామస్థులకు హామీ ఇచ్చారు.

అక్కడనుంచి నర్సాపురం వచ్చి, కారుమీద తమ పరివారంతో మొగలతుర్రు, కొప్పర్రు, మచ్చపురి మొదలైన ప్రాంతాలకు వెళ్లి వరిచేలకు ఎంత నష్టం వాటిల్లినదో స్వయంగా తిలకించారు. పన్ను రెమిషను, రెండవపంట పండించుకొనుటకు అనుమతి వెంటనే యిస్తామని మంత్రిగారు రైతులకు వాగ్దానం చేశారు.

సాయంకాలం 5 గంటలకు సబ్ కలక్టరు ఆఫీసులో హెచ్. సీతారామ రెడ్డిగారి అధ్యక్షతను బహిరంగ సభ జరిగింది. శ్రీమతి జి. అమ్మన్న రాజాగారు మాగంటి బాపినీడు, అల్లూరి సత్యనారాయణ రాజు గొట్టుముక్కల వెంకన్న మాగంటి సీతారామదాసు జిల్లా కలక్టరు నర్సాపురం, భీమవరం, ఏలూరు రివెన్యూ డివిజనల్ ఆఫీసర్లు, నర్సాపురం, తణుకు, భీమవరం, తాడేపల్లి గూడెం తాలూకాల తహసీల్‌దార్లు, జిల్లా సప్లయి ఆఫీసరు, జిల్లా అగ్రికల్చరల్ ఆఫీసరు, జిల్లా హెల్తు ఆఫీసర్ ఎగ్జిక్యూటివ్ యింజనీర్లు, డెల్టరన్ డివిజన్ యాప్టరన్ డివిజన్ నర్సాపురం. తణుకు, తాడేపల్లి గూడెం తాలూకాల తుపాను బాధితుల సహాయసంఘ సభ్యులు సభకు హాజరయ్యారు.

నర్సాపురం అసిస్టెంటు యింజనీరుగారు మాట్లాడుతూ తాము రెండవ పంటకు నీరు అందించుటకుగాను అన్ని ఏర్పాట్లు చేస్తున్నామనిరి.

జిల్లా అగ్రికల్చరల్ ఆఫీసరుగారు మాట్లాడుతూ తాము 3000 బస్తాలు ధాన్యం విత్తనాలకుగాను ఆర్డర్ యిచ్చామనియూ కొంతసరకు తమకు చేరినదనియూ మిగతా సరుకు డిశంబరు 15వ తారీఖులోపుగా చేరుతుందనియూ చెప్పారు. ఒక్కొక్క దరఖాస్తుదారుకి వాయిదాలమీద వడ్డీలేని షరతుల మీద 50/- అప్పు యిచ్చుటకు ఏర్పాట్లు చేశామని అన్నారు. జిల్లాకలెక్టరు జనాబ్ షేక్ అహమ్మద్‌గారు మాట్లాడుతూ, గాలి వానవలన పంటలకు, పశువులకు అమితంగా నష్టము వాటిల్లినదనియూ తాము జిల్లాలో అధికార అనధికార సభ్యులతో కూడిన తుపానుబాధితుల సహాయసఘాంలు ఏర్పాటు చేసితిమనియూ, ప్రభుత్వం యింతవర్కు యిచ్చిన 40000/- రూపాయలు తాలూకాలోని అధికార్ల చేత పంచిపెట్టించితి మనియూ, యింకా గవర్నమెంటువారు 5 లక్షల రూపాయలు మంజూరు చేసిరనియూ అన్నారు. భీమవరం తాలూకాలో యింతవర్కు 50 వేల రూపాయల విరాళాలు వసూలు చేసినారనియూ జిల్లాలో కనీసం 2 లక్షల రూపాయలు చేయాలనియూ గాలివానవల్ల నిరాధారులైన వారివద్దనుంచి అప్పులకు దరఖాస్తు పుచ్చుకొన వలసినదిగా రెవ తాశీల్దార్లకు ఉత్తరువులు జారీచేసినా మనియూ, గవర్నమెంటువారు పంచాయతీబోర్డులకూ, మునిసిపాలిటీలకు విరివిగా విరాళాలుయివ్వవలసినదిగా తాఖీదులు పంపినారనియు చెప్పినారు. జవ్వాది లక్ష్మయ్య నాయుడుగారు తణుకు తాలూకాకు కూడ రెండవ పంటకు అనుమతి యివ్వాలన్నారు.

డాక్టరు ఎల్లంరాజు సూర్యనారాయణగారు పశ్చిమ గోదావరిజిల్లాను తరుగుజిల్లాగా ఎంచాలన్నారు. నీదలకు, చవకగా బియ్యం అమ్మించాలనియూ గవర్నమెంటు బియ్యండిపోలు పెట్టాలనియూ చెప్పారు. మాగంటి సీతారామదాసుగారు మాట్లాడుతూ ధాన్యసేకరణ పెంటనేమాని వేసి ఆ సిబ్బందిచేత గ్రామమునకు సంబంధించినపనులు చేయించాలనియూ చెప్పారు గొట్టుముక్కల వెంకన్నగారు మాట్లాడుతూ గాలివానవల్ల హరిజనులు ఎక్కువ నష్టపడ్డారనియూ, ఎయిడెడ్ స్కూళ్లు కూడ చాలనష్టపడినవనియూ వాటికికూడ గ్రాంట్లు ఇవ్వాలనియూ చెప్పారు. శ్రీమతి అమ్మన్న రాజాగారు మాట్లాడుతూ గాలివానవల్ల పశువులు చాల చనిపోయినవనియూ, పశుగ్రాసము లేదనియు, నర్సాపురం నుంచి, సముద్రప్రాంతానికి, రోడ్లు వేయించి సముద్రప్రాంతీయులకు సహాయ పడాలనియూ చెప్పారు. మాగంటి బాపినీడుగారు మాట్లాడుతూ, మంత్రిగారు యింతవరకు యీ ప్రాంతాలకు రానందుకు, కొందరు దుష్ప్రచారము చేయుచున్నారనియూ గవర్నమెంటువారు ప్రజలకు సహాయము చేయుటకు అమిత సన్నాహాలు చేయుచున్నారనియు చెప్పిరి. అల్లూరి సత్యనారాయణ రాజాగారు మాట్లాడుతూ యీ సాంబార్లు రైతుల వద్దనుంచి పండిన పంటలో నుంచి చెరిసగము పుచ్చుకొనవలెనని చెప్పారు. నర్సాపురం తాలూకా తుపాను సహాయ సంఘ కార్యదర్శి యర్రమిల్లి నారాయణమూర్తిగారు మంత్రిగారికి, వినతి పత్రము సమర్పించారు. 91216 ఎకరాల వరిపంట నష్టపడినదనియూ 18332 ఎకరాల తోటలు మొదలైనవి నష్టపడినవనియూ 3900 పశువులు, 81 మంది జనమూ గాలి వానవల్ల చనిపోయినారనియూ 62 వేల రూపాయిలచేపలుపట్టుకునే కెలలు వరటం వల్ల పోయినవనియూ తాలూకాలో రెండు కోట్ల 22 లక్షల రూపాయిల విలువగల ఆస్తి నష్టపడినదనియూ వ్యవసాయ పనిముట్ల కొనుక్కొనుటకు అప్పులు యివ్వాలనియూ, విత్తనాలూ, ఎరువులూ, సప్లయి చేయాలనియూ చెప్పారు.

సీతారామ రెడ్డిగారు మాట్లాడుతూ అధికార అనధికార సంఘాల వారు తుపాను బాధితులకు వెంటనే సహాయపడినందుకు తాము చాల సంతోషిస్తున్నామనియూ, గవర్నమెంటు వారు ప్రజలకు అన్ని విధాలా సహాయ పడుతారనియూ, తిండికి గింజలు లేక ప్రజలు యిబ్బంది పడుతున్నట్లు తమకు తెలిసినదనియూ ఒక వేళ యీ ప్రాంతాల నుంచి బియ్యం కొద్ది బస్తాలు పై ప్రాంతాలకు ఎగుమతి అయినా, కట్టింపు. సరకు అవసరాన్ని బట్టి దిగుమతి చేయిస్తామనియూ వేములదీవి ప్రాంతాల అగ్నికులక్షత్రియులకు చేపల వలలు అల్లుకొనేందుకు గాను 20 వేల రూపాయలు గవర్నమెంటు వారు యివ్వ సంసిద్ధులుగా వున్నారని చెప్పారు.

రాత్రి 8 గంటలకు మంత్రి గారు కాలేజి విద్యార్థుల సభలో ఉపన్యసించారు. నిన్న ఉదయం 8 గంటలకు మంత్రి గారు వారి బృందము తూర్పు గోదావరి జిల్లాలో పర్యటించుటకు వెళ్లిరి. (స్వ. వి.)

## పిఠాపురమునకు రివెన్యూమంత్రిగారి రాక

పిఠాపురం, డిసెంబరు 1: నిన్న ఉదయం పది గంటలకు మద్రాసు రివెన్యూ మంత్రి శ్రీ హెచ్. సీతారామరెడ్డిగారు పిఠాపురం వచ్చారు. వారివెంట మద్రాసు శాసనసభాసభ్యులు మల్లిపూడి పళ్లంరాజుగారు, తూర్పు గోదావరిజిల్లా కలెక్టరుగారు కూడా ఉన్నారు. మంత్రిగారికంటె ముందు తూర్పు గోదావరి జిల్లా బోర్డు అధ్యక్షులు మూరిన నరసన్న గారు, తూ॥ గో॥ జిల్లా కాంగ్రెసు అధ్యక్షులు బిక్కిన వెంకటరత్నంగారూ, జిల్లాలోని తదితర ప్రముఖులు వచ్చారు. మంత్రిగారు పిఠాపురం వస్తూనే రాజాగారి కోటలోకి వెళ్లారు. పిఠాపురం ఎస్టేటుకి ప్రభుత్వం చేత మేనేజరుగా నియమించబడిన యం. వెంకటేశ్వర్లు, డిప్యూటీ మేనేజరుగార్లు మంత్రి సీతారామరెడ్డిగార్కి ఆఫీసులను రికార్డులను, చూపిస్తూ మేప్ సహాయంతో ఏలేరునది పుట్టుపూర్వోత్తరాలను, మొన్నటి తుపానులో ఏలేరునది ఎక్కడెక్కడ గండ్లుపడిందో ఆవివరాలను చూపించారు.

అనంతరం సీతారామరెడ్డిగారికి ఆర్. బి. పెండ్యాల, వై. వి. భద్రంగార్లు గ్రామసేవాదళం తరఫున రేవునుకు సంబంధించిన వివరాలన్నీ చెబుతూ ఒక నివేదికను సమర్పించారు. మంత్రిగారు నివేదికను చూచి అక్కడే ఉన్న రేవును ఆఫీసర్లతోనూ, జిల్లా కలెక్టరుగారితోనూ నివేదికలోని విషయాలను గురించి విచారించారు.

తర్వాత రివెన్యూమంత్రిగారు ఇక్కడనుంచి తిన్నగా తుని వెళ్లిపోయారు.

## కృష్ణాలో మంత్రి సంజీవరెడ్డి పర్యటన

### బందరు పురపాలకసంఘ సన్మానసమర్పణ

బందరు, డిసెంబరు 3: ఆంధ్రదేశం, రాయలసీమల వాణిజ్యరంగంలో మచిలీపట్టణం త్వరలోనే తన ఉన్నతస్థానాన్ని తిరిగి సంపాదించగలదనీ, దానివల్ల స్వదేశీ పరిశ్రమలన్నీ తిరిగి అభివృద్ధి పొందగలవనీ, మద్రాసు మంత్రి సంజీవరెడ్డిగారు నిన్న సాయంత్రం ఇక్కడ అన్నారు.

పురపాలక సంఘంవారు, పట్టణ కాంగ్రెసువారు సమర్పించిన సన్మానపత్రములకు సమాధానంగా సంజీవరెడ్డిగారింకా ఇలా అన్నారు.

"చుక్కానిలేని పడవలాగా నేను తిరుగాడిన నా చిన్నతనపురోజుల్లో నాకు సరియైనమార్గం చూపినది మన రాష్ట్రపతి డా॥ పట్టాభిగారే ఆయన నాకు రాజకీయ గురువు. ఆయన ఈ పట్టణానికి, ఈ దేశానికి చేసినసేవ అమూల్యమైనది."

సన్మానపత్రంలో బందరు అభివృద్ధికై కోరబడిన సముద్రపు కట్టలు, మురికినీటి పారుదల, ఇతర గ్రాంట్లను గూర్చి చెబుతూ, పీటివిషయం రాష్ట్రీఖజానా పరిస్థితిమీద ఆధారపడి వుందనీ, ప్రభుత్వం కోట్లకొలదీ రూపాయల ఆదాయం వదులుకుని ప్రజానస్కారకార్యములను తలపెట్టినందున, ఈ లోపాన్ని క్రొత్త పన్నులద్వారా భర్తీచేయవలసి వుందనీ, దీనికి ప్రజలు ముఖ్యంగా ధనాఢ్యులు సహాయపడాలనీ మంత్రిగారు చెప్పారు.

పురపాలక సంఘాధ్యక్షుడు అచ్యుత రామయ్యగారు, పట్టణకాంగ్రెసు అధ్యక్షుడు కె. మల్లికార్జునుడుగారు సమర్పించిన సన్మానపత్రంలో అనేక ఇతర విషయాలతోపాటు, కలంకారీ పరిశ్రమను, చేపలపరిశ్రమ, తివాచీ నేత మొదలైన వాటి నభివృద్ధిచెయ్యాలనీ, బందరురేవును బాగు చేసి, సముద్రపుకట్టలు నిర్మించాలనీ, బందరులో మురికినీటి పారుదల సౌకర్యాలు కలిగించాలనీ కోరబడింది. సంఘాంతంలో పురపాలక సంఘ ఉపాధ్యక్షుడు నరసింహారావుగారు వందనములు సమర్పించారు. సభ మునిసిపల్ పార్కులో జరిగింది. స్వ. వి.

## గుడివాడలో సంజీవరెడ్డిగారికి పౌరసన్మానం

గుడివాడ, డిశంబరు 2: మద్రాసు మధ్యనిషేధమంత్రి నీలం సంజీవరెడ్డిగారు, శ్రీమతి వల్లభనేని సీతామహాలక్ష్మమ్మ, కొల్లిపర సూరయ్య, మాగంటి అంకినీడు, ఈడ్పుగంటి లింగయ్యగార్లతో నిన్న మధ్యాహ్నం యిక్కడకువచ్చారు. గుడివాడ పురపాలకసంఘాధ్యక్షులు గోనుగుంట్ల సుబ్రహ్మణ్యగుప్త, పురపాలకసంఘ సభ్యులు, పట్టణకాంగ్రెసు అధ్యక్షుడు మూడెడ్ల రామారావుగారు మంత్రిగారికి స్వాగతమిచ్చారు. గౌరీశంకర సినిమా హాలులో మంత్రిగారికి పౌరసన్మానం ఒసంగబడింది. పురపాలక సంఘాధ్యక్షులు సుబ్రహ్మణ్యగుప్తగారు మాట్లాడుతూ గుడివాడలో తుపానువల్ల 3 వేలయిండ్లు కూలిపోయాయనీ, 14 మంది మరణించారనీ చెప్పి బాధితులకు ప్రభుత్వం అధికంగా సహాయంచెయ్యాలని కోరారు. ప్రభుత్వ గృహనిర్మాణపథకం మధ్యతరగతివారికి, కార్మికులకు సహాయపడటం లేదనిచెప్పి, పట్టణంలోని హరిజనులనుకూడ ప్రభుత్వ హరిజనాభివృద్ధి పథకంలోచేర్చి, వారికి ఉచితంగా యిండ్లస్థలము లివ్వవలసిందని కోరారు.

మంత్రిగారు ప్రసంగిస్తూ, తుపానువల్ల మరణించినవారివల్ల ఏర్పడినవష్టమును ఏ ప్రభుత్వము తొలగించలేదనీ, ప్రభుత్వ సహాయమునకుతోడు ప్రజలు ముందుకు ఈ బాధితులకు సహాయపడవలెననీ, అన్నారు. గ్రామాలలోను, పట్టణాలలోను ఉన్న హరిజనులకు ఇండ్లస్థలములు యివ్వటానికి అవకాశాలు కలుగజేయబడునని అన్నారు. తాను యీ ప్రాంతాలలో యింతకుముందే పర్యటించ దలచుకొన్నప్పటికీ, శాసనసభా కార్యకలాపాలవల్ల రాలేకపోయానని అన్నారు.

తర్వాత మంత్రిగారు మునిసిపల్ మాధ్యమిక పాఠశాల ప్రారంభోత్సవంలో పాల్గొన్నారు. ఈ పాఠశాల మానేజిమెంటును జిల్లాబోర్డునుండి పురపాలక సంఘం గైకొన్నది. ప్రధానోపాధ్యాయులు పాఠశాల చరిత్రను వివరించి స్కూలునకు నూతన భవనములు లాబొరేటరీ కావాలని అన్నారు. మంత్రిగారు మాట్లాడుతూ గుడివాడ మంచి విద్యా కేంద్రమగునట్లు చెయ్యటానికి పురజనులు కృషిచెయ్యవలసిందని ఉద్బోధించారు. మునిసిపల్ కమీషనరు టి. బాసప్పగారు వందనములు సమర్పించుటతో ఉత్సవ కార్యక్రమం ముగిసింది.

మంత్రిగారు బుడమేరు వరదబాధిత ప్రాంతాలను చూసి ముదినేపల్లి వెళ్ళారు. మంత్రిగారు నిన్న జనిగుసల్వే పల్లిలో మాతాశిశు పోషణ కేంద్రమునకు శంకుస్థాపన జరిపి నెహ్రూగా విగ్రహమును ఆవిష్కరించారు. ఈ ఉత్సవానికి కోగాలి అంజనేయులుగారు అధ్యక్షత వహించారు.

## బొంబాయిలో గృహనిర్మాణ సమస్య

### 6 కోట 50 లక్షల ప్రణాళిక

బొంబాయి, డిశంబర్ 2: బొంబాయి ప్రభుత్వ గృహనిర్మాణ సంఘం వారు ఈవేళ తమ ప్రణాళికను ప్రకటించారు.

1950-51 సంవత్సరంలో 6 కోట 50 లక్షల రూపాయలు ఖర్చుపెట్టి క్రొత్త యిండ్లు నిర్మించటానికి వీరు పథకాన్ని తయారుచేశారు.

## స్వామీ సర్వగతానంద పర్యటనం

### తుపాను బాధితులకు తోడ్పడుమని భారతీయులకు విజ్ఞప్తి

బందరు, డిశంబరు 2: రామకృష్ణ మిషన్ (విశాఖపట్నం)కు చెందిన స్వామీ సర్వగతానంద తుపాను, వరదలవల్ల సర్వనాశనమైన జిల్లాలలో నవంబరు 11 నుండి ఎడతెగని పర్యటనచేస్తూ, పాడిపంటలకు, ఇళ్లకు, మనుష్యులకు సంభవించిన విపరీతనష్టాన్ని, అధికార అనధికారవర్గాలు బాధితులకు చేసిన సహాయాన్ని పరిశీలించారు.

కృష్ణాజిల్లాలో నవంబరు 26 నుండి డిసెంబరు 1 వరకూ సంచరిస్తూ, గుడివాడ తాలూకాలోని నందివాడ, ముదినేపల్లి ఫిర్కా గ్రామాలను, కొల్లేరులోని ద్వీపగ్రామాలను, కైకలూరు తాలూకాలోని సింగరాయపాలెం, పెదకుమ్మిడి, బందరుకు చెందిన అర్తమూరు, ముంజులూరు, నడకుదురు చెరుకు గ్రామాలను ఆయన చూశారు. నవంబరు 30 న కృష్ణా కలెక్టరు జె. పారేఖ్‌గారిని దర్శించి జిల్లాలోని తుపాను నష్టాన్నిగూర్చి, చేయబడిన సహాయాన్నిగూర్చి సంభాషించారు.

నేటిఉదయం పత్రికా విలేఖరులకు తాను చూసిన విశేషాలన్నిటినీ వివరిస్తూ, బాధితుల సహాయ కార్యక్రమం అతి భారమైనదని, నిరాశ్రయులకు కొంత వరకు అన్నవస్త్ర సహాయం చేయబడినప్పటికీ, ఇంకా సహాయం అందవలసిన బాధితులు వేలకొలది ఉన్నారనీ, ప్రభుత్వం మంజూరుచేసిన సహాయం సరిపోదు కనుక ఇండియా అంతటినుండీ విరాళాలు ప్రోగుచేయవలసి వున్నదనీ, ఈ కార్యమునకు అనేక ప్రజాహిత సంస్థలతోపాటు రామకృష్ణమిషన్ కూడా పూనుకున్నదనీ స్వామీజీ చెప్పారు. ఈ సత్కార్యమునకు తోడ్పడవలసిందిగా ఆయన భారతీయులకు విజ్ఞప్తి చేశారు. (స్వ. వి.)

## బందరు తుపాను బాధితులకు రెడ్‌క్రాస్ సంఘ విరాళం

బందరు, డిసెంబరు 2: బందరులో తుపానువల్ల నిరాశ్రయులైన బీదప్రజల పునరావాసమునకై రెడ్‌క్రాస్ సంఘపు కృష్ణాజిల్లా శాఖవారు ఇప్పటికి 500 రూ॥ పంచిపెట్టారు. (స్వ. వి.)

## గాంధీగ్రాంలో తుపాను బాధితుల సహాయనిధి సంఘం

విశాఖపట్టణం, నవంబరు 30: తుపాను బాధితుల సహాయార్థం సింధియా నౌకా నిర్మాణ కేంద్రకార్మికులు, ఉద్యోగస్థుల వద్ద, గాంధీగ్రాం నివాసులవద్ద విరాళములు వసూలుచేయుటకై నేడిక్కడి స్థానిక కాంగ్రెసుకమిటీచే ఒక ప్రత్యేక సంఘాన్ని యేర్పాటు చేయడమయింది. ఆ సంఘానికి అధ్యక్షులుగా నౌకాశ్రయ స్థానిక ప్రతినిధి వి. యన్. వంకావాలాగారు, కార్యదర్శిగా మురికెట్టి సాంబశివరావ్ బాబ్జీ కోశాధికారిగా పంపాన అప్పారావుగార్లు ఉన్నారు. ఈ సంఘం వారు ఆధమం 5000 రూపాయిలైనా వసూలుచేసి జిల్లాకలెక్టరుద్వారా గవర్నరునిధికి పంపించటానికి నిర్ణయించారు.

## ఐర్‌కు భారత రాయబారి ఆగమనం

### ప్రధానితో చర్చలు

డబ్లిన్, డిసెంబర్ 2: ఐర్‌లో భారత రాయబారిగా నియమితుడయిన వి. కె. కృష్ణమీనన్ నిన్న ఇక్కడికి వచ్చి, ప్రధాని కాస్టెల్లోనూ, విదేశాంగమంత్రి మెక్‌బ్రైడ్‌నూ కలుసుకున్నాడు. అధికార చిహ్నాలను ఐర్ అధ్యక్షునికి ప్రదర్శించిన,తరవాత ఈయన ఇక్కడికి రావటానికి ఇదే మొదటిసారి.

కృష్ణమీనన్ లండన్‌లోనూ, ఐర్‌లోనూ కూడా భారత రాయబారిగా ఉన్నాడు.

ఈయన రేపు పోప్ ప్రతినిధినీ, డబ్లిన్ క్యాథలిక్ ఆర్చిబిషప్‌నీ కలుసుకుంటారు. ఐర్ ప్రభుత్వసభ్యులకు అల్పాహారవిందు చేసి అధ్యక్షుడు ఓకెల్లీని ప్రత్యేకంగా టీకి పిలుస్తారు. రేపురాత్రి అధ్యక్షుడూ, డబ్లిన్ యూనివర్సిటీ కాలేజీ కలిసి ఈయన గౌరవార్థం విందు చేస్తారు.

## న్యూయార్కు దూది

న్యూయార్కు, డిసెంబరు 3:
డిశంబరు 30.14 / 30.17 మార్చి 30.14 / 30.17 మే 30.08 / 30.08 జూలై 29.66 / 29.66 అక్టోబర్ 28.20 / 28.20 డిశంబరు 28.12 / 28.12 మార్చి 28.01 / బిడ్ 28.03 అస్క్‌డ్ మార్చి 27.98 / బిడ్ 28.01 అస్క్‌డ్

| | | |
|---|---|---|
| స్పిన్లింగ్ | బజారు | 30.81 |
| మార్చి | (గరిష్ఠధర) | 30.22 |
| | (కనిష్ఠధర) | 30.12 |







Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra patrika Press No. 7, Thambu Chetty Street, G. T. Madras.